# అథ పంచమో%ధ్యాయః

# శివావతారములు

శివ ఉవాచ |

దశ##మే ద్వాపరే వ్యాసస్త్రి ధామా నామతో మునిః | హిమవచ్ఛిఖరే రమ్యే భృగుతుంగే నగోత్తమే || 1

తత్రాపి మమ పుత్రాశ్చ భృంగాద్యాశ్శ్రుతి సంమితాః | బలబంధుర్నరామిత్రః కేతుశృంగస్త పోధనః || 2

ఏకాదశే ద్వాపరే తు వ్యాసశ్చ త్రివృతో యదా | గంగా ద్వారే కలౌ నామ్నా తపో%హం భవితా తదా || 3

లంబోదరశ్చ లంబాక్షః కేశలంబః ప్రలంబకః | తత్రాపి పుత్రాశ్చత్వారో భవిష్యంతి దృఢవ్రతాః || 4

ద్వాదశే పరివర్తే తు శతతేజాశ్చ వేదకృత్ | తత్రాప్యహం భవిష్యామి ద్వాపరాంతే కలావిహ || 5

హేమకంచుక మాసాద్య నామ్నా హ్యత్రిః పరిప్లుతః | వ్యాససై#్యవ సాహాయ్యార్థం నివృత్తి పథరోపణః || 6

సర్వజ్ఞ స్సమబుద్ధిశ్చ సాధ్యశ్శర్వస్సుయోగినః | తత్రేతి పుత్రాశ్చత్వారో భవిష్యంతి మహామునే || 7

శివుడిట్లు పలికెను-

పదవ ద్వాపర యుగములో త్రిధాముడు అను మహర్షి వ్యాసుడగును. నేను సుందరమగు హిమవత్పర్వత శిఖరమునందు భృగుతుంగమను పర్వత శ్రేష్ఠమునందు అవతరించెదను (1). ఆ అవతారము నందు కూడ నాకు బలబంధువు, నరామిత్రుడు, తపోధనుడగు కేతుశృంగుడు, మరియు భృంగుడు అను వేదవేత్తలగు నల్గురు పుత్రులు ఉండగలరు (2). పదకొండవ ద్వాపరమునందు త్రివృతుడు వ్యాసుడగును. అపుడు

కలియుగమునందు గంగాద్వారమునందు నేను తపుడు అను పేర అవతరించెదను (3). ఆ అవతారమునందు కూడా నాకు దృఢమగు వ్రతముగల నల్గురు పుత్రులు ఉండగలరు. లంబోదరుడు, లంబాక్షుడు, కేశలంబుడు, ప్రలంబకుడు అనునవి వారి పేర్లు (4). పన్నెండవ ద్వాపరయుగము ప్రవర్తిల్ల గానే శతతేజనుడు వేదవ్యాసుడగును. ఆ ద్వాపరము పూర్తి అయిన పిదప కలియుగమునందు నేను మరల భూమియందు అవతరించగలను (5). అపుడు నేను అత్రి అను పేరుతో హేమకంచుక నగరమునందు నివసిస్తూ వ్యాసునకు సాహాయ్యమొనరించి జ్ఞానమార్గమును ప్రతిష్ఠించెదను (6). ఓ మహర్షీ! ఆ అవతారములో నాకు గొప్ప యోగీశ్వరులగు నలుగురు పుత్రులు ఉండగలరు. సర్వజ్ఞుడు, సమబుద్ధి, సాధ్యుడు, శర్వుడు అనునవి వారి పేర్లు (7).

త్రయోదశే యుగే తస్మిన్ ధర్మో నారాయణస్సదా | వ్యాసస్తదాహం భవితా బలిర్నామ మహామునిః || 8

వాలఖిల్యాశ్రమే గంధమాదనే పర్వతోత్తమే | సుధామా కాశ్యపశ్చైవ వసిష్ఠో విరజాశ్శుభాః || 9

యదా వ్యాసస్తు రక్షాఖ్యః పర్యాయే తు చతుర్దశే | వంశ ఆంగిరసే తత్ర భవితాహం చ గౌతమః || 10

తత్రాపి మమ తే పుత్రా భవిష్యంతి కలౌ తదా | అత్రిర్దవశదశ్చైవ శ్రవణోఽథ శ్నవిష్కటః || 11

వ్యాసః పంచదశే త్రయ్యారుణిర్వై ద్వాపరే యదా | తదాహం భవితా వేదశిరా వేదశిరస్తథా || 12

మహావీర్యం తదస్త్రం చ వేదశీర్షశ్చ పర్వతః | హిమవత్పృష్ఠ మాసాద్య సరస్వత్యాస్తథోత్తరే || 13

తత్రాపి మమ చత్వారో భవిష్యంతి సుతా దృఢాః | కుణిశ్చ కుణిబాహుశ్చ కుశశీరః కునేత్రకః || 14

పదమూడవ ద్వాపరయుగములో నిత్యధర్మస్వరూపుడగు నారాయణుడు వ్యాసుడు కాగలడు. అపుడు నేను బలి అను పేరు గల మహర్షినై (8), పర్వతశ్రేష్ఠమగు గంధమాదనమునందు వాల ఖిల్యుల ఆశ్రమములో అవతరించగలను. నాకు సుధాముడు, కాశ్యపుడు, వసిష్ఠుడు, విరజసుడు అను నల్గురు శుభకరులగు పుత్రులు ఉండెదరు (9). పదునాల్గవ ద్వాపరయుగములో రక్షుడు వ్యాసుడు కాగా, నేను అంగిరసుని వంశములో గౌతముడనై అవతరించెదను (10). ఆ అవతారములో కూడా కలియుగమునందు నాకు అత్రి, దవశదుడు, శ్రవణుడు మరియు శ్నవిష్కటుడు అను నల్గురు కుమారులు కలుగగలరు (11). పదునైదవ ద్వాపరయుగములో త్రయ్యారుణి వ్యాసుడు కాగా, నేను వేదశిరస్సు అను పేరుతో అవతరించగలను (12). వేదశిరస్సు అను పేరుతో మహాశక్తి గల అస్త్రము గలదు. హిమాలయములో సరస్వతీ నదియొక్క ఉత్తర తీరమునందు వేదశీర్షము అను పర్వతముగలదు. నేను అచట అవతరించెదను (13). ఆ అవతారములో కూడా నాకు కుణి, కుణిబాహుడు, కుశశీరుడు, కునేత్రకుడు అను బలవంతులగు నల్గురు కుమారులు కలిగెదరు (14).

వ్యాసోయుగే షోడశే తు యదా దేవో భవిష్యతి | తదా యోగప్రదానాయ గోకర్ణో భవితా హ్యాహమ్ || 15

తత్రైవ చ సుపుణ్యం చ గోకర్ణం నామ తద్వనమ్ | తత్రాపి యోగినః పుత్రా భవిష్యం త్యంబుసంమితాః || 16

కాశ్యపో%ప్యుశనాశ్చైవ చ్యవనో%థ భృహస్పతిః | తే%పి తే నైవ మార్గేణ గమిష్యంతి శివాలయమ్ || 17

పరివర్తే సప్తదశే వ్యాసో దేవకృతంజయః | గుహావాసీతి నామ్నాహం హిమవచ్ఛిఖరే శుభే || 18

మహాలయే మహోత్తుంగే శివక్షేత్రం హిమాలయమ్ | ఉతథ్యో వామ దేవశ్చ మహాయోగో మహాబలః || 19

పరివర్తే%ష్టాదశే తు యదా వ్యాస ఋతంజయః | శిఖండీ నామతో%హం తద్ధిమవచ్చి ఖరే శుభే || 20

సిద్ధక్షేత్రే మహాపుణ్యే  శిఖండీ నామ పర్వతః | శిఖండినో వనం వాపి యత్ర సిద్ధనిషేవితమ్ || 21

పదునారవ ద్వాపరయుగములో దేవ మహర్షి వ్యాసుడై అవతరించును. అపుడు నేను యోగవిద్యను గరపుటకై గోకర్ణుడనై అవతరించగలను (15). నేను అవతరించిన స్థలము గోకర్ణవనము అనబడును. ఆ అవతారములో కూడ నాకు జలమువలె నిర్మలమైన యోగులు పుత్రులగుదురు. గోకర్ణవనము పరమపవిత్రమైనది (16). కాశ్యపుడు, ఉశనసుడు, చ్యవనుడు మరియు బృహస్పతి అనునవి వారి పేర్లు. వారు కూడ అదే యోగమార్గముననుసరించి శివుని ధామమున చేరగలరు (17). పదునేడవ ద్వాపరములో దేవకృతంజయుడు వ్యాసుడగును. అపుడు నేను మిక్కిలి ఎత్తైనది, శుభకరము, మహాలయమను పేరు గలది అగు హిమాలయ శిఖరమునందు గుహావాసి అను పేరుతో అవతరించెదను. ఉతథ్యుడు, వామదేవుడు, మహాయోగుడు, మహాబలుడు అను వారు నాకు పుత్రులు కాగలరు (18, 19). పదునెనిమిదవ ద్వాపరయుగములో ఋతంజయుడు వ్యాసుడగును. అపుడు నేను పరమపవిత్రమైనది, శుభకరమైనది, సిద్ధక్షేత్రమని ప్రసిద్ధిగాంచినది అగు హిమాలయ శిఖరమునందు శిఖండి యను పేరుతో అవతరించగలను. ఆ శిఖండి ఉండే వనమున కూడా సిద్ధులు సేవించెదరు (20, 21).

వాచశ్రవా రుచీకశ్చ స్యావాస్యశ్చ యతీశ్వరః | ఏతే పుత్రా భవిష్యంతి తత్రాపి చ తపోధనాః || 22

ఏకోన వింశే వ్యాసస్తు భరద్వాజో మహామునిః | తదాప్యహం భవిష్యామి జటీ మాలీ చ నామతః || 23

హిమవచ్ఛిఖరే తత్ర పుత్రా మే%ంబుధి సంమితాః | హిరణ్యనామా కౌశల్యో లోకాక్షీ ప్రధిమిస్తథా || 24

పరివర్తే వింశతిమే భవితా వ్యాసో గోతమః | తత్రాట్టహాస
నామాహమట్టహాసప్రియా నరాః || 25

తత్రైవ హిమవత్పృష్ఠే అట్టహాసో మహాగిరిః | దేవమానుషయక్షేంద్ర
సిద్ధచారణసేవితః || 26

తత్రాపి మమ తే పుత్రా భవిష్యంత సుయోగినః | సుమంతుర్వ్వర్వరి
ర్వ్విద్వాన్ కబంధః కుశికంధరః || 27

ఏకవింశే యుగు తస్మిన్ వ్యాసో వాచశ్ర్శవా యదా | తదాహం
దారుకో నామ తస్మా ద్దారువనం శుభమ్ || 28

ఆ అవతారమునందు కూడ నాకు వాచశ్ర్శవసుడు, రుచీకుడు, స్యావాస్యుడు, మరియు యతీశ్వరుడు అను తపోధనులగు పుత్రులు కలుగగలరు (22). పందొమ్మిదవ ద్వాపరములో భరద్వాజ మహర్షి వ్యాసుడు కాగలడు. అపుడు కూడ నేను జటాధారినై మాలియను పేరుతో అవతరించగలను (23). నేను హిమాలయ శిఖరమునందు అవతరించెదను. ఆ అవతారములో నాకు సముద్రమువలె గంభీరస్వభావము గల నలుగురు పుత్రులు ఉండెదరు. హిరణ్యుడు, కౌశల్యుడు, లోకాక్షి మరియు ప్రధిమి అనునవి వారి పేర్లు (24). ఇరువదియవ ద్వాపరయుగములో గోతముడు వ్యాసుడు కాగలడు. అదే సమయములో నేను అట్టహాసుడను పేర అవతరించగలను. మానవులకు అట్టహాసమన్న ప్రీతి మెండు (25). హిమాలయములలో అట్ట హాసమను పెద్ద పర్వతము గలదు. దానిని దేవతలు, మనుష్యులు, యక్షప్రభువులు8, సిద్ధులు మరియు చారణులు సేవించెదరు (26). ఆ అవతారములో కూడ నాకు సుమంతుడు, విద్వాంసుడగు వర్వరి, కబంధుడు, కుశికంధరుడు అను గొప్ప యోగులు పుత్రులు కాగలరు (27). ఇరువది ఒకటవ ద్వాపరయుగములో వాచశ్ర్శవసుడు వ్యాసుడగును. అపుడు నేను దారుకుడను పేర అవతరించెదను. నేను అవతరించిన శుభవనమునకు దారువనమని పేరు (28).

తత్రాపి మమ తే పుత్రా భవిష్యంతి సుయోగినః | ప్లక్షో దార్భాయణిశ్చైవ కేతుమాన్ గౌతమస్తథా || 29

ద్వావింశే పరివర్తే తు వ్యాసశ్శుష్మాయణో యదా | తదాప్యహం భవిష్యామి వారాణస్యాం మహామునిః || 30

నామ్నావై లాంగలీ భీమో యత్ర దేవాస్సవాసవాః | ద్రక్ష్యంతి మాం కలౌ తస్మిన్ భవం చైవ హలాయుధమ్ || 31

తత్రాపి మమ తే పుత్రా భవిష్యంతి సుధార్మికాః | భల్లవీ మధుపింగశ్చ శ్వేతకేతుస్తథైవ చ || 32

పరివర్తే త్రయోవింశే తృణబిందుర్యదా మునిః | శ్వేతో నామ తదాహం వైగిరౌ కాలంజరే శుభే || 33

తత్రాపి మమ తే పుత్రా భవిష్యంతి తపస్వినః | ఉశికో బృహదశ్వశ్చ దేవలః | కవిరేవ చ || 34

పరివర్తే చతుర్వింశే వ్యాసో యక్షో యదా విభుః | శూలీ నామ మహాయోగీ తద్యుగే నైమిషే తదా || 35

తత్రాపి మమ తే శిష్యా భవిష్యంతి తపస్వినః | శాలిహో త్రాగ్నివేశశ్చ యువనాశ్వశ్శరద్వసుః || 36

ఆ అవతారము నందు కూడా నాకు ప్లక్షుడు, దార్భాయణి, కేతుమంతుడు మరియు గౌతముడు అనే యోగీశ్వరులగు పుత్రులు కలుగగలరు (29). ఇరువది రెండవ ద్వాపరములో శుష్మాయణుడు వ్యాసుడు కాగా, నేను కూడా అపుడు వారాణసిలో మహర్షినై అవతరించగలను (30). నా పేరు అపుడు లాంగలీభీముడు అని ఉండగలదు. ఆ అవతారములో ఇంద్రాది దేవతలు ఆ కలియుగములో నాయందు నాగలి అను ఆయుధమును ధరించిన శివుని దర్శించగలరు (31). ఆ అవతారము నందు కూడా నాకు భల్లవి, మధుపింగుడు, శ్వేతకేతువు అను పరమధార్మికులగు పుత్రులు కలుగగలరు (32). ఇరువది మూడవ ద్వాపరములో తృణబిందువు వ్యాసుడు కాగా, నేను శ్వేతుడను పేరుతో

పవిత్రమగు కాలంజర పర్వతమునందు అవతరించెదను (33). ఆ అవతారమునందు కూడ నాకు ఉశికుడు, బృహదశ్వుడు, దేవలుడు మరియు కవి అను తపశ్శాలురగు నల్గురు కుమారులు కలుగగలరు (34). ఇరువది నాల్గవ ద్వాపరములో యక్షుడు వ్యాస విభుడు కాగా, అదే యుగములో నేను శూలియను పేరుగల మహాయోగినై నైమిషారణ్యమునందు అవతరించెదను (35). ఆ అవతారమునందు కూడా శాలిహోత్రుడు, అగ్నివేశుడు, యువనాశ్వుడు మరియు శరద్వసువు అను తపశ్శాలురగు శిష్యులు నాకు ఉండగలరు (36).

పంచవింశే యదా వ్యాసశ్శక్తి ర్నామ్నా భవిష్యతి | తదాప్యహం మహాయోగీ దండీ ముండీశ్వరః ప్రభుః || 37

తత్రాపి మమ తే శిష్యా భవిష్యంతి తపస్వినః | ఛగలః కుండకర్ణశ్చ కుంభాండశ్చ ప్రవాహకః || 38

వ్యాసః పరాశరోయర్షి షడ్వింశో భవితాప్యహమ్ | పురం భద్రవటం ప్రాప్య సహిష్ణుర్నామ నామతః || 39

తత్రాపి మమ తే శిష్యా భవిష్యంతి తపస్వినః | ఉలూకో విద్యుతశ్చైవ శంబూకో హ్యాశ్వలాయనః || 40

సప్తవింశే యదా వ్యాసో జాతూకర్ణ్యో భవిష్యతి | ప్రభాసతీర్థమాశ్రిత్య సోమశర్మా తదాప్యహమ్ || 41

తత్రాపి మమ తే శిష్యా భవిష్యంతి తపస్వినః | అక్షపాదః కుమారశ్చోలూకో వత్సస్తథైవచ || 42

అష్టావింశే ద్వాపరే తు పరాశరసుతో హరిః | యదా భవిష్యతి వ్యాసో నామనా ద్వైపాయనః ప్రభుః || 43

ఇరువది అయిదవ ద్వాపరములో శక్తియను మహర్షి వ్యాసుడు కాగలడు. అపుడు కూడా సర్వేశ్వరుడను, సర్వశక్తి మంతుడను అగు నేను ముండిత శిరస్కుడు, దండధారి అగు మహాయోగినై జన్మించెదను (37). ఆ అవతారమునందు కూడ నాకు భగలుడు,

కుండ కర్ణుడు, కుంభాండుడు మరియు ప్రవాహకుడు అను నలుగురు తపశ్శాలురు శిష్యులు కాగలరు (38). ఇరువది ఆరవ ద్వాపరములో పరాశరమహర్షి వ్యాసుడగును. అపుడు కూడ నేను సహిష్ణుడు అను పేర భద్రవట నగరములో అవతరించగలను (39). ఆ అవతారమునందు కూడ ఉలూకుడు, విద్యుతుడు, శంబూకుడు మరియు ఆశ్వలాయనుడు అను తపశ్శాలురు నాకు శిష్యులు కాగలరు (40). ఇరువది ఏడవ ద్వాపరమునందు జాతూకర్ణ్యుడు వ్యాసుడు కాగలడు. అప్పుడు కూడ నేను సోమశర్మ అను పేరుతో ప్రభాసతీర్థమునందు అవతరించగలను (41). అచట కూడా నాకు అక్షపాదుడు, కుమారుడు, ఉలూకుడు మరియు వత్సుడు అను తపశ్శాలురగు శిష్యులు ఉండగలరు (42). ఇరవై ఎనిమిదవ ద్వాపరయుగములో విష్ణువు పరాశరుని కుమారుడై వ్యాసుడు కాగలడు. ఆ ప్రభునకు ద్వైపాయనుడని పేరు (43).

తదా షష్ఠేన చాంశేన కృష్ణః పురుషసత్తమః | వసుదేవ సుతశ్రేష్ఠో వాసుదేవో భవిష్యతి || 44

తదాప్యహం భవిష్యామి యోగాత్మా యోగమాయయా | లోకవిస్మాపనార్థాయ బ్రహ్మచారి శరీరకః || 45

శ్మశానే మృతముత్సృజ్య దృష్ట్వా కాయమనామయమ్ | బ్రాహ్మణానాం హితార్థాయ ప్రవిష్టో యోగమాయయా || 46

దివ్యాం మేరుగుహాం పుణ్యాం త్వయా సార్ధం చ విష్ణునా | భవిష్యామి తదా బ్రహ్మన్ లకులీ నామ నామతః || 47

కాయావతార ఇత్యేవం సిద్ధక్షేత్రం పరం తదా | భవిష్యతి సువిఖ్యాతం యావద్భూమిర్ధరిష్యతి || 48

తత్రాపి మమ తే శిష్యా భవిష్యంతి తపస్వినః | కుశికశ్చైవ గర్గశ్చ మిత్ర స్తౌరుష్య ఏవ చ || 49

యోగినో బ్రాహ్మణా వేదపారగా ఊర్ధ్వరేతసః | ప్రాప్య మాహేశ్వరం యోగం గమిష్యంతి శివం పురమ్ || 50

అదే కాలములో పురుషోత్తముడగు విష్ణువు ఆరవ అంశముతో శ్రీకృష్ణుడై జన్మించును. వసుదేవుని శ్రేష్ఠ పుత్రుడగు అతడు వాసుదేవుడని ప్రసిద్ధిని గాంచును (44). ఆ యుగమునందు కూడా నేను లోకములను ఆశ్చర్యములో ముంచెత్తుటకై యోగమాయాప్రభావముచే యోగస్వరూపుడనై బ్రహ్మచారి శరీరమును దాల్చి అవతరించెదను (45). నేను అపుడు శ్మశానములో గాయములు ఇతర దోషములు లేని మృతదేహమును గాంచి యోగమాయా ప్రభావముచే స్వశరీరమును విడిచి బ్రాహ్మణులకు హితమును చే గూర్చుట కొరకై దానిలో ప్రవేశించెదను (46). ఓ బ్రహ్మ ! అపుడు నేను నీతో మరియు విష్ణువుతో గూడి దివ్యము, పవిత్రమునగు మేరు పర్వతగుహను ప్రవేశించెదను. అపుడు నేను లకులి అను పేరుతో ప్రసిద్ధిని గాంచెదను (47). ఈ తీరున నా ఈ కాయప్రవేశరూపమగు అవతారము లోకమునందు ప్రసిద్ధిని పొందును. ఆ స్థలము గొప్ప సిద్ధ క్షేత్రము కాగలదు. ఈ ఖ్యాతి మరియు పవిత్రత భూమి ఉన్నంతవరకు ఉండును (48). ఆ అవతారమునందు కూడా నాకు కుశికుడు, గర్గుడు, మిత్రుడు మరియు తౌరుష్యుడు అను తపశ్శాలురగు నల్గురు శిష్యులు ఉండగలరు (49). యోగులు, బ్రాహ్మణులు, వేదవేత్తలలో అగ్రగణ్యులు మరియు ఊర్ధ్వరేతస్సులునగు ఆ శిష్యులు మహేశ్వర యోగమును పొంది శివపురమును చేరుకొనగలరు (50).

వైవస్వతేంతరే సమ్యక్ ప్రోక్తా హి పరమాత్మనా |
యోగేశ్వరావతారాశ్చ సర్వావర్తేషు సువ్రతాః || 51

వ్యాసాశ్చై వాష్ట వింశత్యా ద్వాపరే ద్వాపరే విభోః |
యోగేశ్వరావతారశ్చ ప్రారంభే చ కలౌ కలౌ || 52

యోగేశ్వరావతారాణాం యోగమార్గ ప్రవర్ధకాః | మహాశైవాశ్చ
చత్వారశ్శిష్యాః ప్రత్యేకమవ్యయాః || 53

ఏతే పాశుపతాశ్శిష్యా భస్మోద్ధూలిత విగ్రహాః |
రుద్రాక్షమాలాభరణాస్త్రి పుండ్రాంకితమస్తకాః || 54

శిష్యా ధర్మరతాస్సర్వే వేదవేదాంగపారగాః | లింగార్చనరతా నిత్య బాహ్యాభ్యం తరతస్థ్సితాః || 55

భక్త్యా మయి చ యోగేన ధ్యాననిష్ఠా జితేంద్రియాః | సంఖ్యయా ద్వాదశాధిక్యశతం చ గణితా బుధైః || 56

వైవస్వత మన్వంతరములోని అన్ని మహాయుగములయందు శివుని గొప్ప వ్రతము గల యోగేశ్వరావతారములన్నియు పరమాత్మచేతనే చక్కగా వర్ణించ బడినవి (51). ప్రతిద్వాపరమునందు ఉండే ఇరవై ఎనిమిది వ్యాసులు మరియు ప్రతి కలియుగమునకు ఆరంభములో శివుని యోగేశ్వరావతారములు నిరూపించబడినవి (52). ప్రతి యోగేశ్వరావతారమునకు నల్గురు శిష్యులు గలరు. యోగమార్గమును వర్ధిల్లజేయువారు, మహాశైవులు, శాశ్వతపరబ్రహ్మస్వరూపులు అగు ఆ శిష్యులు చెప్పబడినారు (53). ఈ పశుపతి యొక్క శిష్యులు భస్మలేపనము గల దేహములతో, రుద్రాక్షమాలలను ఆభరణములగా దాల్చి లలాటమునందు త్రిపుండ్రము గల వారై శోభిల్లెదరు (54). ఆ శిష్యులందరు ధర్మనిష్ఠులు, వేదవేదాంగముల యందు దిట్టలు మరియు ప్రతిదినము బాహ్యమునందు, హృదయగుహ యందు కూడ లింగార్చన చేయటలో అభిరుచిగలవారు (55). జితేంద్రియులై నాయందలి భక్తితో మరియు యోగముతో ధ్యానమునందు నిష్ఠను కలిగియున్న వారి సంఖ్య నూటపన్నెండు అని పండితులు గణించినారు (56).

ఇత్యేతద్వై మయా ప్రోక్త మవతారేషు లక్షణమ్ | మన్వాది కృష్ణ పర్యంత మష్టావింశద్యుగక్రమాత్ || 57

తత్ర శ్రుతి సమూహానాం విధానం బ్రహ్మలక్షణమ్ | భవిష్యతి తదా కల్పే కృష్ణ ద్వైపాయనో యదా || 58

ఇత్యేవముక్త్వా బ్రహ్మాణమనుగృహ్య మహేశ్వరః | పునస్సంప్రేక్ష్య దేవేశస్త త్రైవాంతరధీయత || 59

ఇతి శ్రీ శివమహాపురాణ  శతరుద్రసంహితాయాం శివావతార వర్ణనం నామ పంచమోఽధ్యాయః (5)

నేను ఇంతవరకు మనువుతో మొదలిడి శ్రీ కృష్ణుని వరకు ఇరువది ఎనిమిది మహాయుగములలో శివుని అవతారవిశేషములను వర్ణించితిని (57). కృష్ణద్వైపాయనుడు వ్యాసుడైన ఆ మహాయుగములో వేదవాక్యములకు బ్రహ్మసూత్ర విధానము నిర్మాణమై, బ్రహ్మ ప్రతిపాదకమగు వేదాంత శాస్త్రము ప్రసిద్ధిని గాంచును (58). దేవదేవుడగు మహేశ్వరుడు బ్రహ్మతో నిట్లు పలికి బ్రహ్మను తన కృపాదృష్టితో అనుగ్రహించి అచటనే అంతర్ధానమయ్యెను (59).

శ్రీ శివమహాపురాణములోని శతరుద్రసంహితయందు శివావతార వర్ణనమనే అయిదవ అధ్యాయము ముగిసినది (5).